# కాంగ్రెసు కార్యసమితి తీర్మానము

## మహాత్ముడే ఏదోకఠినచర్య నవలంబించ దలచుచున్నాడా?

వర్ధా, జూలై౧౪

నేటిరాజకీయ పరిస్థితులనుగురించి కాంగ్రెసు కార్యసమితితనతీర్మానము నేడుప్రకటించినది. ఇదిగ౨౦౦పదాలు గలిగియున్నది- ఆతీర్మానమందుఇప్పటివరకు కాంగ్రెసుఅవలంబించిన వైఖరిని సంగ్రహముగా పేర్కొనినతర్వాత బ్రిటిషుపరిపాలకులు ఈదేశమునువదలవలెనని కోరబడినది.

తొందరపడి కాంగ్రెసు ఏచర్యనుగాని అవలంబించదలచుటలేదని చెప్పి, మిత్రరాజ్యాలకు చిక్కుపెట్టకుండుటకు వీలైనంతవరకు ప్రయత్నించగలమనినతర్వాత కాంగ్రెసుకోర్కెను అంగీకరించవలసినదిగా బ్రిటిష్‌వారికివిజ్ఞప్తి చేయబడినది- ఈవిజ్ఞప్తి విఫలమైన పక్షములో భారతదేశపు రాజకీయహక్కులను దానిస్వాతంత్ర్యమును సంపాదించుటకై గాంధిగారినాయకత్వమున అహింసాపద్ధతిన కాంగ్రెసుతనసర్వశక్తులను వినియోగించికృషిచేయకతప్పదని హెచ్చరిక చేయబడినది-

బ్రిటిష్‌పరిపాలనను తొలగించినవెంటనే దేశములోనిబాధ్యతగలవార లందరుచేరి, వివిధసంఘాలప్రతినిధులతోగూడిన ఒకతాత్కాలిక ప్రభుత్వమునుస్థాపింతురు- ఈప్రభుత్వమువారు సకలప్రజలకుసమ్మతమైన రాజ్యాంగవిధానమును నిర్ణయించుటకుప్రజాపరిషత్తునుసమావేశపరతురు

ఈతీర్మానమునుండి ప్రధానమైన సమస్యలుఉత్పన్నమైనవి-కనుక,దీనినిగురించిచర్చించుటకును దీనినిధ్రువపరచుటకును అఖిలభారత కాంగ్రెసు పరిషత్తుసమావేశము బొంబాయిలో ఆగస్టు౭వతేదినజరుగునట్లు నిర్ణయించబడినది.

కాంగ్రెసు కోర్కెను బ్రిటిషుప్రభుత్వమువారుఅంగీకరించినపక్షములో బ్రిటను ప్రతినిధులు, స్వతంత్రభారతదేశప్రతినిధులు తమభావిసంబంధములనుగురించియు, దురాక్రమణను కాంక్షించుచున్న రాజ్యాలను ప్రతిఘటించుటకు కావలసిన చర్యలనుగురించిచర్చించుటకు సమావేశమై తగు నిర్ణయములకు రాగలరు.

ప్రజలయేకమత్యముతో వారిసహాయ్య సానుభూతులతో భారతదేశముదురాక్రమణను ప్రతిఘటించవలెననియే కాంగ్రెసుహృదయపూర్వకముగా అభిలషించుచున్నది-

యుద్ధనిర్వహణమునందు మిత్రరాజ్యాలకుప్రతిబంధకములుకలిగించవలెననిగాని, భారతదేశముపై దురాక్రమణను ప్రోత్సహించవలెననిగాని చైనాపైజపాను ఒత్తిడి ఎక్కువకావలెననిగాని జర్మనీపక్షరాజ్యాలలో దేనికైనను సహాయ్యము చేయవలెననిగాని, కాంగ్రెసుకాంక్షించి ఈతీర్మానమునుచేయుటలేదు-

బ్రిటిషుపరిపాలకులు భారతదేశమునుంచి వైదొలగవలెననికోరుటలో బ్రిటిషువారుఒక్కపురుషుడు లేకుండ వెళ్లిపోవలెనని కాంగ్రెసు తాత్పర్యముగాదు- భారతదేశము స్వస్థానముగాచేసుకొని, భారతప్రజలక్షేమమునకు పాటుపడుచు భారతీయులతో తామునసమానులమని భావించుచున్న బ్రిటిష్‌వారు వెళ్లిపోవలెనని అసలేకాంగ్రెసుకోరికకాదు-

బ్రిటిషువారు వైదొలగుట సుహృద్భావముతోజరిగినచో అందువల్లభారతదేశములో సుస్థిరమైనతాత్కాలికప్రభుత్వము ఏర్పడగలదు-

దురాక్రమణనుప్రతిఘటించుచున్న మిత్రరాజ్యాలతో భారతదేశమునహాకారముచేయుటకును చైనాకుఅధికసహాయముచేయుటకును ఇదితోడ్పడగలదు-

ఈవిధానమును అవలంబించుటలో చిక్కులున్నవనికాంగ్రెసుగుర్తించుచున్నది- కాని స్వాతంత్ర్యమునుసంపాదించుకొనగోరితే ఏదేశమైననుచిక్కులను ఎదుర్కొనుటకు సంసిద్ధతను ప్రదర్శించితీరవలెనుముఖ్యముగా ఈవిషమ సమయములో దేశమును రక్షించుటకేమి ప్రపంచస్వాతంత్ర్యమును ఇంతకంటెపెద్దచిక్కులనుండి కాపాడుటకేమి ఈతీర్మానములో గర్భితమైయున్న స్వల్పప్రమాదాలను ధైర్యముగా ఎదుర్కొనవలెనదే!

అందుచేతతన తుదిలక్ష్యమునుసాధించుటలో కాంగ్రెసుతొందరను గలిగియున్నను తొందరపడిఏచర్యలనుగానిజరుపరాదనియే ఆదికోరుచున్నది-మిత్రరాజ్యాలకు చిక్కుపెట్టరాదనికూడ అదికాంక్షించుచున్నది-

ఈతీర్మానములో తెలుపబడిన సక్రమన్యాయబద్ధవాంఛలను ఆమోదించవలసినదిగా కాంగ్రెసుబ్రిటిషుప్రభుత్వమును కోరుచున్నది- దానివల్ల భారతదేశానికేకాకుండ మానవస్వాతంత్ర్యానికిని ఏస్వాతంత్ర్యరక్షణకై మిత్రమండలిరాజ్యములు కామపోరాడుచున్నట్లుతెలుపుచున్నవో దానికిఅపారమైనమేలు చేకూరగలదు-

కానిఏకారణముచేతనైనను ఈవిజ్ఞప్తి విఫలమైనపక్షములో నానాటికి అధ్వాన్నమైపోవుచున్నఇప్పటిదేశపరిస్థితులను కాని అంతకంతకుప్రజలప్రతిఘటనశక్తి క్షీణించిపోవుటయును దుస్థితిని కాని సహించుచుకాంగ్రెసు ఊరుకొనలేదు- అప్పుడదిగత్యంతరంలేకతప్పనిసరిగా ౧౯౨౦నుండికూడప్రజలరాజకీయాధికారములను స్వాతంత్ర్యమును కాపాడుటకుఅహింసనుతనవిధానముగా చేసుకొన్న నాటినుండికూడ తానుకూడగలిగినఅహింసాబలము సంతయు గత్యంతరములేక వినియోగించవలసివచ్చును- అహింసాబద్ధమైన ఈప్రజోద్యమమువిధిగా గాంధిగారినాయకత్వముక్రింద నుండగలదు-

ఈతీర్మానమువల్ల అతిముఖ్యమైన సమస్యలు ఉత్పన్నమగుచున్నవి-గనుక వాటినిగురించి ఆలోచించుటకు అఖిలభారతకాంగ్రెసుసంఘసమావేశమును ఆగస్టు౭వతేదిన కార్యసమితివారు బొంబాయిలోఏర్పాటుచేయగలరు.

జూలై౧౪వతేదిన కాంగ్రెసుకార్యసమితిసమావేశములో గాంధిమహాత్ముడు మౌలానాఅజాదుగారికిని ఇతరులకునుతననిశ్చయమును కార్యవిధానమును వివరించె ననుకొనుచున్నారు-వారుఇప్పటిపరిస్థితులలో జీవించియుండుటయేదుస్సహమని తలచుచున్నారు. అందువల్లనాయన ఏదోఒకమహాతీవ్రమైనచర్యను గైకొనదలచుచున్నట్లుకనిపించుచున్నదట. తనవిధానము అమలుజరిగినతర్వాతఆచర్యజరుగవచ్చునా జరుగకూడదాఅనువిషయమును వారు కాంగ్రెసుకార్యసమితినిర్ణయమునకువదలవచ్చునట గాంధిమహాత్ముని నిర్ణయముకార్యసమితికి తెలియజేయబడినట్లు కనిపించుచున్నది,



# సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షత

## నెహ్రూగారు స్వీకరించుట

పండితజవహర్లాలునెహ్రూగారు ఈ క్రింది ప్రకటనను గావించినారు;—

"సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుసమితి అధ్యక్షునియొక్క అరెస్టువల్ల ఆకాంగ్రెసుసమితి కార్యసమితివారు నాకిదివరలోగా పనిచేయుటకై కోరినది-

నాకున్న ఇతర పనుల వల్లనేను ఎంతో యున్నందువల్ల నేనుకొంతసంకోచముతో ఈభారమునువహించినాను- కానిమాయున్నచిన్న కార్యసమితిలో అనేకులుసహాధర్మచరులు ఇదివరకేఅరెస్టుచేయబడి శిక్షవిధించబడియో లేక విచారణలేకయేచెరసాలలోబంధించబడియో ఉన్నప్పుడును నేను కాదనజాలకపోతిని- ఈవిధముగ మాఅధ్యక్షునితోను కార్యదర్శితోను మాసభ్యులతోను; సహాధర్మచరులతోనుకలిసి చాల గౌరవమునకు పాత్రులైన ఒకరితోనుకలిసి కమ్యూనిస్టులు ఈవిధముగా వెళ్లిపోయినారు- మౌలానాహుసేన్ అహ్మదీమదానిగారి అరెస్టుఅసాధారణమైన ఆశ్చర్యమునుకలిగించినది- ఎందుకనగా వారు ముఖ్యముగాచేసెడిపని దేవబందులోప్రసిద్ధమైన విద్యాసంస్థయొక్కప్రధానివారు చేయుచుండినపనియే కానిసంయుక్తరాష్ట్రములో మాకేదిగానిఅశ్చర్యముకలిగించజాలదు. ఈచెప్పినదానియందటివల్లను ఇంకనుఎంతైననుజరుగవచ్చును. కావుటఅట్టిసంభావ్యములవల్లను సంయుక్తరాష్ట్రకాంగ్రెసుసమితియొక్క అధ్యక్షపదవినిర్వహణచాలకష్టమైనదే,కాని నాకు నాసహాధర్మచరులును సంయుక్తరాష్ట్రములోని తేలికోటిపనివారలును తెలుసును. వారలనునమ్మికొనినేనుయీభారమునుబూనుచున్నాను- విపత్తులుండుకొనివచ్చి మీదబడుచున్న ఈరోజులలో నేనువారలకుచేయువిజ్ఞప్తిఏమనగాఅందరునుఐకమత్యముకలిగివిధేయులైయుండి మనహృదయములయందున్న ఆశయముకొరకై త్యాగములన్నిటినిచేయుటకు సిద్ధపడియుండుడు-"

## ఉత్తర అమెరికాసంపద

ఉత్తరఅమెరికా ఖండములో మూడుస్వతంత్రదేశాలున్నవి. [౧]కనడా [౨]అమెరికాసంయుక్తరాష్ట్రము (౩)మెక్సికో-ఈమూడింటిలో చేరినయీఖండములో ఖనిజసంపద అపారముగా ఉన్నది- మొత్తము ప్రపంచములోనిఖనిజసంపదలోఅమెరికా ఖండములో ఎన్నిపాళ్ళసంపద ఉన్నదో ఈ క్రిందిపట్టికవలన తెలియగలదు-

| వస్తువు | ప్రపంచోత్పత్తిలో నూటికి |
|---|---|
| బంగారు | ౩౦ పాళ్లు |
| ప్లాటినం | ౩౯ ,, |
| రాగి | ౪౧ ,, |
| జింక్ (గత్తుతాగం) | ౫౧ ,, |
| కర్రగుజ్జు [వుడ్ పల్ప] | ౪౪ ,, |
| నికెల్ | ౯౪ ,, |
| అల్యూమినం | ౩౭ ,, |
| సీసము | ౭౯ ,, |
| విద్యుత్తు ఉత్పత్తి | ౪౫ ,, |
| ఉక్కు | ౩౪ ,, |
| కాయబొగ్గు (కోక్) | ౩౧ ,, |
| గంధకం | ౪౧ ,, |
| నేలబొగ్గు | ౩౪ ,, |
| మోటార్లఉత్పత్తి | ౯౧ ,, |
| కిరోసీన్ నూనె | ౭౪ ,, |
| వాదరసంఉత్పత్తి | ౨౫ ,, |
| కృత్రిమపట్టు | ౨౪ ,, |
| ప్రత్తి | ౪౩ ,, |
| క్యాడియంలోహము (cadium) | ౯౧ ,, |
| మోలదము (Molybdenum) | ౯౫ ,, |
| వెండి | ౭౯ ,, |

అమెరికానుండి యుద్ధసామగ్రి చేర్చవలెనంటేటేకొక్క ముఖ్యయుద్ధకేంద్రానికెంతదూరము ప్రయాణంచేయవలెనో ఈక్రిందిపట్టిక తెలుపును.

| | |
|---|---|
| చంకింగ్ (చీనాముఖ్యపట్నం) | ౧౨౦౦౦ మైళ్లు |
| ఢిల్లీ | ౧౧౦౦౦ ,, |
| సిడ్నీ [ఆస్ట్రేలియాలో] | ౭౦౦౦ ,, |
| కైరో | ౧౨౦౦౦ ,, |
| లండన్ | ౧౪౦౦౦ ,, |
| మాస్కో | ౧౪౦౦౦ ,, |

## శ్రీ ఆంధ్రగ్రంథాలయము

(ఒ-వి) చేర్యాల ౫-౧౦-౧౩౫౧

నిజక్ష్యేష్ఠ బ॥౧-౦ ఆంధ్రగ్రంథాలయ (ఉప శాఖగా) భజనమండలి స్థాపింపబడినది-స్థానిక ప్రజలు చాలవరకు పాలుగొనిరి- ఇక్కడినుంచి ప్రతి శుక్రవారము సాయంత్రము భజనజరుగగలదు- "ఈగ్రంథాలయము శుక్రవారమునాడే స్థాపింపబడినది-అందుచేత జ్ఞాపకార్థముగా శుక్రవారమునాడే ఈమండలి ప్రారంభింప బడినది-

---

## నిజాంరాష్ట్రఆయుర్వేద పురోభివృద్ధి సంఘము

(ఒ-వి) మానుకోట జూలై౧౮

నిజక్ష్యేష్ఠబ॥౧౦ ప్రతాపనిరత్నము గారి గృహములో శ్రీగట్ల నరసింహాచార్యులు గారి అధ్యక్షతక్రింద మానుకోటలో ఆయుర్వేదవైద్యుల సమావేశమై ఈ క్రింది పాలకవర్గను ఎన్నుకొనిరి-౧ అధ్యక్షులు బంగపురం కొండమాచార్యులుగారు మానుకోట ౨-కార్యదర్శి-కుర్మా వీరయ్యగారు ౩-మానుకోట వీరుఅధికారసభ్యులు పైవారు కారసభ్యులను ౧౨గురిని తాలూకాలోని అన్ని భాగములకు ఒక్కొక్కరినిగా ఎన్నుకొనైనది,

---

## వెలిమినేడులో పోస్టు ఏర్పడుట

(ఒ.వి.) ౧౦-౧౦-౫౧

ఈగ్రామము భువనగిరి తాలూకాలోనిది- హైదరాబాదనుండి నార్కట్‌పల్లికిపోవు రోడ్డు కుప్రక్క నదులు-జనసంఖ్య ఇరువైవేలకు పైగానున్నది-సర్కారివైద్య పాఠశాలగలదు- తపాలసౌకర్యములేక పత్రికలయొక్కయు ఉత్తరములయొక్కయు రాకపోకలకు చాలకష్టములు జరుగుచుండెను- దీనివిషయమై ముఖ్యులును అభిమానులును, విద్యాప్రియులును అగు శ్రీ కోటపల్లిబుచ్చిరెడ్డిగారు ప్రయత్నించి డిపార్టుమెంటు చేసి తపాలాఫీసు ఏర్పాటుచేయించినారు-గ్రామప్రజలు శ్రీ రెడ్డిగారిని ప్రత్యేకముగ ఆనందముతో గొనియాడుచున్నారు-

---

## వైదిక సేవాసంఘ ప్రారంభోత్సవము

(స్వ.వి.) తిరుమలగిరిబజారు, ౧౫-౩-౫౧.

తిరుమలగిరిబజారులో హిందువులెల్లరి భిన్నభావములను దూరోన్ముఖముగావించి, ఐకమత్యమును కలిగించి, హిందూమతాభివృద్ధికి కృషిసల్పుటకును, వైదికసిద్ధాంతములద్వారా విద్యాప్రచారము గావించుటకును, నూతనముగా స్థాపింపబడిన వైసంఘప్రారంభోత్సవము, నిజక్ష్యేష్ఠబ॥౧౫ సోమవారం (౮-౩-౫౧)ఉదయము, వేదోక్త హవనము (హోమము)తో ప్రారంభమై అత్యంత జయప్రదముగా జరిగినది.

ఉత్సవాధ్యక్షులు—పండిత, శ్రీమకంఠ కృష్ణస్వామి నాయుడుగారును, భజనోపదేశకులగు శ్రీమన్నాలాల్ మిశ్ర. పం- రఘునాథసింహాగారును ఉపన్యాసకులగు పండిత వెంకటరమణవీరభద్రస్వామి, శ్రీయుత రామారావు, శ్రీయుత ఆంజనేయదాస్ గారును, సంఘస్థాపకులగు పంజాబునివాసి, హిందూమతప్రేమాభిలాషులు శ్రీయుత రామచంద్రగారును, సంఘాధ్యక్షులగు- శ్రీయుత ఆకులరాజయ్యగుప్త గారును, తమ అమూల్యోపదేశములతోను, రసవంతమైనభజనలతోను, సభ్యులను ఆనందపరవశులగావించిరి-ఎల్లరకు కృతజ్ఞతాపూర్వకవందనములతోను, శాంతి పాఠములతోను. ఉత్సవముసమాప్తమయ్యెను

---

## శాలిబండ ఆర్యసమాజమందిరంలో స్త్రీలకు ఏ. ఆర్. పి. శిక్షణ

౧౮-౩-౫౧

హైదరాబాదు-దక్కన్ నగరంశాలిబండా ఆర్యసమాజమందిరములో ౧౩జూలై౧౮ సోమవారము మధ్యాహ్నము ౩గంటలకు స్థానిక యువతీమండలి సమావేశములో శ్రీమతి. సీతాకుమారిగారు తెలుగులో చక్కగా ఉపన్యసించిరి.

భారతదేశపు స్త్రీసంఘముల గలలోపములను పూర్తిగా వివరించుచు అట్టి సంఘలోపములకిక ముందు తావీయకుండునట్లు యువతీమణులను హెచ్చరించినారు-

మరియు ఎ-ఆర్-పి- శిక్షణపొందుట స్త్రీలకు ఆవశ్యకమైనదని నొక్కిచెంచుచు అట్టిశిక్షణమాత్రమునిచ్చుటఏర్పాటుచేయబడదనియు వెలిచ్చినారు సాధ్యమైనంతత్వరలోనే శాలిబండా ఆర్యసమాజమందిరములో స్త్రీలకు ఎ ఆర్ పి-శిక్షణకేంద్రము ఏర్పాటుకాగలదు-

---

లాలాగూడాలో హైదరాబాదుప్రభుత్వానికి వాపసువచ్చిన స్థలములలో రైల్వే వారువిమిన్ని సభలు ఇంకా జరిపెంతవరకు చేయగూడదు.

---

## ఏ వార్త

### సదాశివపేట వైశ్యుల విభేదములు

మల్కాపురములో సమావేశమైన నిజాంరాష్ట్రప్రథమాంధ్ర మహాసభసందర్భమున సదాశివపేట వైశ్యులలో కక్షలు కలిగినవని తెలిసికొని అప్పటికి తెంచినపండితులు సంఘప్రేమాభిలాషులు యువపక్షముల వైశ్యప్రముఖులకు శక్తివంచనలేకుండ సమన్వయమార్గముపదేశించియుండిరి- కానింతవరకు కక్షలుఅటులనే నిలచియున్నవని తెలిసివిచారపడి యీవిషయమున స్ఫురించిన భావములు ప్రకటించెదను తద్వారా సంఘైక్యతకు ప్రయత్నించుట కర్తవ్యముఅనిపించినది-

ఇదివరకే స్వార్థపరులచే ఖండఖండములుగావి భజింపబడియుంకను స్థిరముగానిలచియున్న హిందూమతముయొక్క పూర్వప్రతిష్ఠత్వముద్ధరించుటకై ప్రయత్నములు చేయబడుచున్న ఈసమయములోయిదివరకున్న శాఖోపశాఖలలో సంతృప్తిచెందక మరికొన్ని నూతనశాఖలు కేర్పరచి హిందూమతమును మరింత నిర్వీర్యమొనర్చుటకంటె అన్యాయమింకొకటుండునా!

పరమతములవలె మనమంతా ఏకధర్మాచరణకుబద్ధులై మెలగుచుండి కేవలముఒక సదాశివపేట వైశ్యులలో కొందరుమాత్రమే ప్రతికూలంగా ప్రవర్తించిన గుణపాఠముకొరకు అట్టివారినిప్రత్యేకించవలసినదే కాని మరియొక గ్రామమునకు ఒకకులాచారము మరియొకకులమునకు వారియింటియాచారము మరియొకయింటికి భిన్నముగామా, పరస్పరవిరుద్ధముగానూ వున్నప్పుడు సంఘమునందు ఐకమత్యము పాడైపోవునని ప్రారంభములో ఐకమత్యముకొరకు దేశకాలపాత్రలనుసరించి సహజముగా జరుగుచారములు పనులవలనయేర్పడిన అభిప్రాయభేదములను శాస్త్రార్థముద్వారాతొలగించి సంఘైక్యతను సాధించుటయే సంఘాభిమానులవిధ్యుక్తధర్మము-కాని బలహీనమైనపరమతములయెదుట పరిహాసపాత్రమగుచున్న హిందూమతములో నూతన పార్టీలేర్పర్చి సహపంక్తిని కూడ మానగావించిమరింతబలహీనపరచుట తగినదికాదు-

కనుక సదాశివపేట వైశ్యప్రముఖులు వైశ్య సంఘైక్యతకు తీవ్రకృషిసల్పి పార్టీలనుతొలగించి యుభయుల యెల్లరకుమార్గదర్శకు లయ్యెదరు గాక-

ఇట్లు
వైశ్యసంఘ ప్రేమాభిలాషి,
ఆకుల రాజయ్యగుప్త,

---

## భారతదేశముయెడ చైనా సానుభూతి

"తాకుస్గపాఫ్రా" అనుపలుకుబడిగల చైనీయ దినపత్రిక యొక్క జూలై౧౦తేది నాటి సంచికలో భారతదేశములో అప్పటిస్థితినిగురించి ఆందోళనను వెల్లడించుచు ఇట్లుఅభిప్రాయమీయబడినది;-

"దురాక్రమణను ప్రతిఘటించుటకును, దాస్యమునుండివిముక్తిపొందుటకును ఇప్పుడుప్రపంచమంతటను జరుగుచున్న ఈమహాయుద్ధములో. భారతదేశములోని మామిత్రులుమనకందరికిని సమానమైనశత్రువు ఎవరగునంటే జపానుయొక్క ఆంతర్యము నెరిగి దురాక్రమణను ప్రతిఘటించుటకై పోరాడగలరనిఎంతో శ్రద్ధతో మేమాశించుచున్నాము- ఈలోగా మేము భారతదేశ స్వాతంత్ర్య కాంక్షయెడ హృదయపూర్వకమైనసానుభూతి కలిగియున్నాము- ఆదేశము స్వాతంత్ర్యమును దాస్యవిముక్తిని పొందగా చూడగోరుచున్నాము-"

---

## రాజగోపాలాచారిగారు తొలగుట

మదరాసుశాసనసభకాంగ్రెసు పార్టీసమావేశము జూలై౧౫తారీసునాటి మధ్యాహ్నముసమావేశమైనపుడు దాని నాయకత్వమును తానువదలుకొనుచుంటినని శ్రీయుత సి-రాజగోపాలాచారిగారుప్రకటించిరి- వారుమదరాసుశాసనసభలోసభ్యత్వముకూడ వదలుకొనిరి-వారితోపాటు శ్రీయుతులు బులుసు సాంబమూర్తి, డాక్టరు రాజన్, రామనాథన్, సుబ్బనియన్, వెంకటాచారి, వెంకట్రామఅయ్యరు గారలుకూడ తమతమ సభ్యత్వములువదలుకొనినారు- సాంబమూర్తిగారు అసెంబ్లీస్పీకరుపదవినికూడ వదలుకొనినారు-రాజగోపాలాచారిగారు రాజీనామానిచ్చుటవల్ల వారిమైనిర్వాహమములేదను తీర్మానము సభలో ప్రతిపాదించకవదలుకొనబడినది-

తుదకుఇదివరలో మదరాసుగాసనసభ కాంగ్రెసు పార్టీవారు పాకిస్థానమునకు అనుకూలముగ గావించియుండినతీర్మానమును రద్దుచేయుటకును అలహాబాదులోఅఖిలభారత కాంగ్రెసుపరిషత్తువారుగావించియుండిన తీర్మానమునకు వ్యతిరేకముగా శ్రీయుత సి రాజగోపాలాచారిగారు మున్నగువారలతప్రచారమును శాసనసభకాంగ్రెసుపార్టీసభ్యులు చేయరాదనుటకును తీర్మానములు ఆమోదించబడెను-

---

## ఉత్కళ రాష్ట్రంలో ఆంధ్రులకష్టములు

పర్లాకిమిడి మహారాజాగారికి సర్ విజయాగారి విజ్ఞప్తి

కటకం, జూలై ౧౫-

ఇప్పుడు ఉత్కళరాష్ట్రములో చేర్చబడినగంజాం కోరాపుట్టిజిల్లాలలోని ఆంధ్రులకష్టములను గురించి ఆంధ్ర మహాసభాధ్యక్షులగు విజయనగరమహారాజకుమార్ సర్ విజయగారు ఉత్కళప్రధానమంత్రియగు పర్లాకిమిడి మహారాజా గారికి యిట్లుఒక లేఖవ్రాసినారు-

"ఉత్కళములో నెల్లాకఅక్టోబరువద్దనుంచి డొమిసైలు సర్టిఫికేటులు తెలుగువారిఆంధ్రులకుప్రభుత్వోద్యోగములు నిర్బంధించుట యాంధ్రవిద్యార్థులను కాలేజీలలో చేర్చుకొనటముచేదని యెవరినాకు తెలిసినది-ఈజిల్లాలలో ఆంధ్రులు అనేకశతాబ్దాలనుంచి తరతరాలుగానివసించుచున్నారు-వీరందరును ఆయాజిల్లాలలోపుట్టినవారే ఇటీవలనే యీజిల్లాలనుప్రభుత్వమువారు ఆంధ్రరాష్ట్రమునుంచి విడదీసి ఉత్కళరాష్ట్రములోచేర్చినారు-కనుక వీరుడొమిసైలుసర్టిఫికేటులను తేవలెననికోరుట న్యాయముకాదు-

రసూల్కొండలోను చత్రపురములోను, అస్కాలోను హైస్కూల్‌లో తెలుగుసెక్షనులు ఎత్తివేసినారు-విద్యార్థులకు అన్నివిషయములను ఉత్కళభాషలోనే నేర్పుచున్నారు- అందువల్ల ఉత్కళములోవున్న ఆంధ్రులు తమబిడ్డలకుబాల్యమునుంచిఉత్కళభాషను నేర్పించవలసివచ్చినది కోర్టునమ్మనులు మునిసిపలునోటీసులు మొదలైనవాటినిఈభాషలోనే వ్రాయుచున్నారు-కాని ఇంగ్లీషుభాషలోవ్రాయుటలేదు-కోరాపుట్టిజయపూరుజిల్లాలలో తెలుగు ఉత్కళము యీరెండుభాషలను వాడుకలోనువున్ననుకోటకుల వాలకులనుఉత్కళభాషలోనేవ్రాసి ప్రకటించుచున్నారు-అందువల్లనోటీసు అధికారముగల అంగీకారములు బ్బంది కలుగుచున్నది-

మీరుకూడాఆంధ్రులే కనుక ఆంధ్రులయిబ్బందులుమీకుచాల బాగుగా తెలిసియుండును- మీరు నిష్పక్షపాతముగా పనిచేయగలరన్న నమ్మకము నాకుమీవిషయములో మొదటినుంచియు ఉన్నది కనుకయీవిషయములో పూర్తిఅయినవిచారణజరుగునట్లుతెంటనేమీరు ఆజ్ఞచేయగోరుచున్నాను-ఉత్కళములోనిఆంధ్రులకిప్పుడుకలుగుచున్న యిబ్బందులన్నిటిని తొలగించవలెనని కూడ నేనుకోరుచున్నాను-తమకు న్యాయము జరగవలెనని మాత్రమే ఆంధ్రులు కోరుచున్నారు మీరిప్పుడుఉత్కళమునకు ప్రధానమంత్రిగా నున్నారు-మీరు న్యాయపక్షపాతులనిచెప్పక్కర్లేదు. కనుక మీరు రెండుచేతులతోను న్యాయము నుపంచిపెట్టగోరుచున్నాను- మీరుదీనికిజవాబు వ్రాయగోరుచున్నాను-అందుకు నేను మీకుకృతజ్ఞుడనుగానుండగలను.

### జవాబు

దీనికిఉత్కళమంత్రివర్గమందొక మంత్రిఅగు పండితగోదావరిమిశ్రగారు ఆంధ్రమహాసభ కార్యదర్శికిట్లు జవాబువ్రాసినారు-

"మహారాజకుమారు గారు మహారాజాగారికివ్రాసినలేఖచేరింది-ఇదిప్రభుత్వమువారి విధానమునకు సంబంధించినదికనుక మంత్రివర్గసభ్యులవారి సభలోదీనినిగురించి ఆలోచించబడును-

---

## యుద్ధానంతర ప్రపంచపునర్నిర్మాణము

లండనుకు ఇండియా ప్రతినిధి పంపబడుట

ఢిల్లీ జూలై౧౫

యుద్ధానంతర ప్రపంచపునర్నిర్మాణంగురించి బ్రిటనులోను అమెరికా సంయుక్తరాష్ట్రములోను కొంతకాలమునుంచి ఆలోచనలుచాలా హెచ్చుగాజరుగుచున్నవి- ఆర్థికాభివృద్ధి, సాంఘికఆర్థికపునర్నిర్మాణము గురించి వీరుముఖ్యముగా ఆలోచించుచున్నారు- ఇండియాప్రభుత్వమువారుకూడా యిండియాలోపునర్నిర్మాణముకై నాలుగుకమిటీలను యేర్పాటు చేసినారు- ఈవిషయముగురించి ఇండియాగోమిక్కిలి హెచ్చుమంది ప్రజలు శ్రద్ధవహించుచున్నారు-కనుకతమశాఖలలో ఒకసభ్యుని ప్రత్యేకముగా లండనుకు పంపి అక్కడవారితో పూర్తిగా తెలుసుకోవలసినదిగా ఇండియాప్రభుత్వము వారిప్పుడు నిశ్చయించినారు-ఇండియా ప్రభుత్వమువారు అర్థసభ్యులైన సర్ జ్వాలాప్రసాదు శ్రీవాస్తవగారు యిందుకుగాను లండనుకు వెళ్లవలెనని ఇండియాప్రభుత్వమువారు ఆజ్ఞచేసిరట-

---

## ఆం. మ. స్థాయిసంఘపు రాజీనామాలు

ని-రా- ఆంధ్రమహాసభ అధ్యక్షులవారి ప్రకటన

మహాసభానంతరము ఉత్కళ ము గురించి స్థాయిసంఘసభ్యుల గురించి పలువిధములగు అభిప్రాయములు ఉనుదు తెలుగు పత్రికాముఖమున ప్రకటించబడుచున్నవి-ఇందువలన ఆంధ్రదేశమునకు అంతుకు గనుపనిచేయు కార్యకర్తలలో భిన్నాభిప్రాయములు యీలాటి దేనికు కారణమేర్పడుచున్నవి- ఆసోసియేటెడు ప్రెస్ ప్రతినిధి యీమధ్య నాకద్ద సంచ్చిన వర్తమానకార్యకారిణీసంఘసభ్యుల నియామకముగురించి ప్రసంగమువచ్చినది-స్థాయిసంఘసభ్యులలో కొందరు ప్రముఖులు రాజీనామాలిచ్చియున్నారని యును వారిరాజీనామాలనుఅంగీకరించుకోమని కోరియున్నారనియును అందుకువారు కొంతచర్చచేసుకొని నాఅభిప్రాయమును అంగీకరించియున్నారనియు యీకారణమున కార్యకారిణీసంఘమును యేర్పాటుచేయుట అసాధ్యమయినదని చెప్పియుంటిని-మరియుకొద్దికాలములో నియామకముచేయుచున్నాననికూడ చెప్పియుంటిని- దీనిట్టిరకటవలిఖితరూపముగా చేసియుండలేను- కాని రాజీనామాలిచ్చినస్థాయిసంఘసభ్యులవలన ప్రతిష్టంభన జరిగినదనుట బద్ధము నాదికాదు- యిదివారి భావమును గ్రహింపుటలోనే శేకభాషాంతరీకరణము లోనే చేర్పబడిన వాక్యములని తోచుచున్నది. ఇట్టిస్థితిలోపత్రికలలోనిశబ్దములకే నావని మీరు గ్రహింపవలదని తెలియచేయుచున్నాను.

మాదిరాజు లాముకోటేశ్వరరావు
అధ్యక్షుడు

---

## కాంగ్రెసు పార్టీ నాయకుని ఎన్నికవాయిదా మదరాసు శాసనసభ

---

## సర్దార్ పటేల్ ఆజ్ఞ

అఖిలభారతదేశపు పార్లమెంటరీబోర్డు అధ్యక్షుడు సర్దార్ వల్లభభాయిపటేల్ గారు జూలై౧౫ వతేదిజరుగనున్న మదరాసు శాసనసభ కాంగ్రెసుపార్టీనాయకుని యెన్నికవాయిదావేయవలెనని రాష్ట్రసంఘములకు ఉత్తరువునిచ్చిరని ప్రపత్రికలు తెలియుచున్నది.

కాంగ్రెసునుండి బులుసుసాంబమూర్తిగారి రాజీనామా

గా। బులుసు సాంబమూర్తి గారు తమస్పీకరు పదవికి, అసెంబ్లీసభ్యత్వమునకు కాంగ్రెసుసభ్యత్వమునకుకూడా రాజీనామానిస్తూ అలహాబాదు తీర్మానముకు అసమ్మతి తెలుపుచూ కాంగ్రెసు అధ్యక్షునకు జూలై౧౮వ తేదీనతంతినిచ్చినట్లుఆంధ్రపత్రికకు రూఢిగ తెలియుచున్నది-

---

